క. బాలుం డల్పప్రకృతిం, జాలను సుఖమందు మఱియు స్వల్పప్రకృతికిన్
జాలిం బడు మలమునఁ గడు, మేలని రమియించు సార మేయము భంగిన్.

చ. అవనిన దొట్టి మహాగ్ర్యమునన న్యులదయ్యు భుజింపరానిద
య్యు వెలయు వస్తుసంతతిని యోడక తా భుజియింపఁ గోరు నిం
దువు నువియత్ప్రదేశమునఁ నుండి గ్రహింపఁగఁ గోరునట్టి మహా
గ్ర్యవిలసితంబు బాల్యము సుఖంబున కెట్లగుఁ దాపసోత్తమా.

క. అలశిశుతం దలితండ్రిల, వలనన్ గురుపరజనములవలనఁ బ్రివయ
స్కులవలన భయము గల్గుట, వలనన్ శైశవము మిగుల భయమందిర మౌ."

ఇట్లుగా నున్న పద్యసప్తకమును సింగకవి యొకసీసపద్యములో నొకకందపద్యములోనం జెప్పె. ఎట్లన్నను:—

" సీ. ఆశాసమావృత మతిశక్తిహీనంబు, జాడ్యంబు దైన్యంబు చపలతయును
మాటాడ నేరమి మాటపొం దెఱుఁగమి, యిది పాము తాఁచని యెఱుక లేమి
మూత్రపురీషసంప్లుత గాత్రుఁడై యుంట, తన్నుఁదా నెఱుఁగక తన్ను కొనుట
కదలి యిట్టట్టు పోఁ గాల్లు రాకుండుట, గురుజనశిక్షలఁ గుటిలపడుట

ఆ. యివియు మొదలుగాఁగ నెన్నఁ బెక్కుగునట్టి, బాధ లనుభవించు బాల్యవృత్తి
పరమమునివరేణ్య ప్రత్యక్షనరకంబు, దీన నేమిసుఖము తెలుపవయ్య.

క. తల్లియుఁ దండ్రియు నితరులు, ప్రిల్లదులై తోడ నాడుపడుచులు నడుమన్
తల్లడపడు శైశవ మిది, చెల్లంబో దురితదుఃఖశీలము కాదే."

ఇట్లే గ్రంథమంతయు నున్న దని సూచించుట కీపద్యములే చాలును. సింగనకవి మాతృకాభిప్రాయానుసారముగాఁ దెనిఁగించుటచేత నాతని గ్రంథముఁ జదువుచున్నపు డదియును మాతృకాగ్రంథమువలెనే యనన్వయాదులు లేక ధారాశుద్ధి గలదిగాఁ గాన్పించు. ఇఁక వేంకరమణ కవికృతగ్రంథము నైసర్గికధార లేనిదై యనన్వయవాక్యపూరితమై మాతృకం జూచినఁగాని కవియభిప్రాయము స్పష్టముగానిదై యుండి కొన్నిస్థలములలో నాంధ్రభాష యిది కాదేమో యనుసంశయము కల్గించుచుండును. ఈరెండుగ్రంథములకుం గలభేదమును స్థాలీపులాకన్యాయంబునఁ జూపినాఁడను గావున నిఁక వేంకటరమణకృతగ్రంథ మెట్లు పరిసమాప్తి నందింపఁబడినదో దానిం జూచెదము. అందులో నీకవి

తా నీగ్రంథము ముగించిన కాలమును దీనిని బరిశీలించిన పండితుని విశే షంబులు వివరించె. అది యెట్లున్నదనఁగా :—

## వార్ధికషట్పది.

"ఒనరు నీకలియుగంబున నాల్గువేలహా, యనములకుఁ బైఁ దొమ్మన్నూటడెబ్బది యొకటి జనినంత వచ్చిన ప్రమోదూతవత్సరపు నాశ్వయుజశుద్ధమందూ, అను గతకుజాఖ్యవాసరమగుఁద్వితీయనాఁ డీకృతిఁ జనియించినంతటఁ బైదుగడియలకు తనరె సంపూర్ణమై యీగ్రంథసత్తమము మత్పుణ్యపటిమచేతన్."

అనఁగాఁ గలియుగములో ౪౯౭౧ సంవత్సరములు కాఁగా వచ్చిన ప్రమోదూతవత్సర ఆశ్వయుజ శుద్ధతదియ మంగళవార మని తేలినది. ఇది చెన్నపట్టణములో ఆ 1873 వ సంవత్సరమునకు సరియగు శ్రీముఖ సంవత్సరములో ముద్రించి ప్రకటింపఁబడినది. అనఁగా క్రీ. ౧౮౭౦ సంవత్సరమునకు సిద్ధమై మఱినాల్గుసంవత్సరములలోపుగానే ముద్రింపఁ బడినది.

## గ్రంథపరిశీలకవిషయము.

"ఉ. ఆ మొదటిప్రసిద్ధకవియాస్యవినిర్గతమైననూక్తులం
దేమివిశేషముల్గలవొ యేమియునేరనిమూఢుఁడైననే
నేమిటిసంగ్రహించితినొ యేమిటినిం ద్యజియించినాఁడనో
యేమిమహాపరాధముదయించెనొయనిసంశయాత్ముఁడై.

సీ. తతసాధుతరసంపదావసథంబయి, పరగుచుండెడి ధర్మపురియనేటి
పురమునం గలవిప్రపుంగవు ధర్మజ్ఞు, కావ్యార్థబోధన కౌశలాఢ్యు
మాద్గల్యగోత్రుసన్మానితసుచరిత్రు, ధీమంతుశాంతుసధీతనిగము
సర్వశాస్త్రార్థజ్ఞు సత్యవ్రతాచారు, జానకీధవపదాబ్జాప్తచిత్తు

తే. గీ. కరతలామలకీకృతపరసుతత్త్వు, పరమమంగళసద్గుణభరితు సమలు
సత్యసంపన్న సుందరశాస్త్రిశిఖ్యుఁ, బిలిచిమన్ననమెయివిన్నవించినంత.

ఉ. అమహనీయమూర్తియుం మహామునిజల్పితమైనకావ్యమా
న్మామకకావ్యముంజదివిమానకచర్చయుఁజేసియాంధ్రమం
దేమియునర్థభేదముదయింపఁగ లే దిదిసాధువన్న నిం
కేమి ధరిత్రి నేనెకృతకృత్యుఁడ నంచు ముదంబుఁ జెందితిన్."

ఇట్లుగాఁ దాను వ్రాసినగ్రంథము నొకరెవరో బాగున్నదన సంతసించునంతటి బుద్ధిశాలి యీగ్రంథమువంటి శాస్త్రముం దెనిఁగింపఁగడఁగుట విశేషగౌరవాహము గా దని నే నూహించెదను. పాఠకులే ఆగ్రంథములోని మంచిచెడ్డ లరయవలసినవారుగావున నిపుడు మనము విస్తరించవలసినది లేదు. మనము ప్రారంభములో సింగనకవిచారిత్ర మారంభించి అతని కథతో దాని ముగించుట న్యాయము కావున నాతని యాశ్వాసాంత గద్యము నిట వివరింతము :—

"ఇది శ్రీనరసింహావరప్రసాదలబ్ధ కవితావిలాసభారద్వాజగోత్రపవిత్ర సరసగుణధుర్య సింగనార్యప్రణీతం బైనజ్ఞానవాసిష్ఠరామాయణమునందు సర్వంబును బంచమాశ్వాసము."

పురాణకవులవివరము.

దీనిం దెల్పుటకుఁ బూర్వము పురాణములనామవివరమును, అట్టి పురాణములలో నెన్ని తెలిఁగింపఁబడినదియు, నట్లుగాఁ దెనిగించిన వారినామములును తెలిసినవఱకు వివరింపఁబడవలసియున్నది. కావున ముందుగఁ బురాణనామముల వివరించెదను. ఎట్లన్నను :—

| ౧౮ పురాణములు. | తెనిఁగించినవారిపేళ్లు. |
|---|---|
| ౧. ఆదిత్యపురాణము | తెలియదు. |
| ౨. కూర్మపురాణము | ౧. మండ చిట్టికామశాస్త్రి. ౨. రామలింగకవి. |
| ౩. గరుడపురాణము | పింగళిసూరకవి. |
| ౪. నారదీయపురాణము. | తెలియదు. |
| ౫. పద్మపురాణము | పద్మపురాణమునకే కథాసంగ్రహము శ్రీనాథకవితాత యగుకమలనాభకవియు దీని యుత్తరఖండము రామగిరి సింగనకవియు తెనుఁగున నొనర్చిరి. |
| ౬. బ్రహ్మకైవర్తము | తెలియదు. |
| ౭. బ్రహ్మాండపురాణము | " |
| ౮. బ్రాహ్మము. | " |
| ౯. భవిష్యోత్తరపురాణము | " |

| | |
|---|---|
| ౧౦. భాగవతము | బమ్మెరపోతనామాత్యుఁడు. ఇది దేవీ భాగవత మని కొందఱిమతము. త్రిపురాన తమ్మనదొర దానిం దెనిఁగించెను. |
| ౧౧. మత్స్యపురాణము | తెలియదు. |
| ౧౨. మార్కండేయపురాణము | మారనకవి, మండ కామశాస్త్రి. |
| ౧౩. వరాహపురాము | ౧ మల్లయమలయమారుతకవులు. ౨. చంద్రహరిభట్టు. |
| ౧౪. వామనపురాణము | తెలియదు. |
| ౧౫. వైష్ణవ మనఁగా విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరకవి. |
| ౧౬. శైవపురాణము | తెలియదు. |
| ౧౭. లింగపురాణము | " |
| ౧౮. స్కాందపురాణము | దీనిలోని కాశీఖండ, భీమఖండములు, శ్రీనాథకవి తెనిఁగించె. కోడూరి వేంకటాచల కవి శివరహస్యఖండమును దెనిఁగించె. హాలాస్య మాహాత్మ్యము తిరుమలసెట్టి జగన్నాథదాస కృతము. |

పై పురాణముల కెదురుగా వ్రాయంబడిన పేరులు గలవిమాత్ర మాంధ్రభాషలలోనికిఁ దేఁబడినవి. తక్కినవి మనకు లభించనివగుట చేత వానివృత్తాంతము వివరింప లేదు. పైవారిలోఁ జారిత్రము గలవఱకు నీకవిజీవితములలోఁ జూపట్టును. మిగిలినవారివి శేషములు కవికావ్య ప్రశంసాచంద్రికలోఁ జూడఁదగును.

క వి జీ వి త ము లు

సమాప్తము.



# శ్రీమదాంధ్రవచనభాగవతము.

## బ్రహ్మశ్రీ, శతఘంటము, వేంకటరంగశాస్త్రి కృతము.

---

శ్రీమన్నారాయణాంశసంభూతుఁడైన వేదవ్యాసమహాముని సంస్కృతభాషను రచించిన శ్రీమద్భాగవతమును బమ్మెరపోతనామాత్యుఁడు గద్యపద్యాత్మకముగా రచియించుట లోకప్రసిద్ధంబుగదా! అయ్యది పద్యబహుళము గావున నందఱను దానియర్థము గోచరింప కుండుటవలనను, మూలముకంటెఁ గొన్ని విషయము లధికముగాఁ జేర్పఁబడియుండుటవలనను దేనుఁగున వచనకావ్యముగ సంస్కృతానుసారముగా రచియింపఁజేసి ముద్రించి ప్రచురించియున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| మూఁడువాల్యములుగా బైండుకట్టబడ్డ | ప్రతి 1-కి | రు. | 7 | 0 |
| ఒకటేవాల్యముగా బైండుకట్టబడ్డ | ప్రతి 1-కి | రు. | 6 | 8 |

# శబ్దార్థచంద్రిక.

శ్రీమహాకాళి. సుబ్బారాయకృత అకారాదినిఘంటువు. పూర్వముద్రణములోని లోపములెల్ల సవరించి లక్ష్మీనారాయణీయము, శబ్దరత్నాకరము మొదలగువానినుండి యపూర్వము లగుపదములు జేర్చి రమ్యముగా ముద్రింపఁబడుచున్నది. రు. 2 0

192, ఎస్ప్లనేడ్
328, తండియార్పేట

వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్,
చెన్నపురి. ఈ.